సహితము చూపించెను. ఆ బాలిక ఇంతకుక్రితము పెగూ పట్టణమును ఎన్నడునూ చూచియుండ లేదు.”

(సనాతనిస్టు 11-1-31)

పై రెండు ఘటనల వలనను పునర్జన్మ సత్యమనియే తెలియుచున్నది. ఇటీవల, కాశీ ప్రాంతమునందు శాంతాదేవి యను ఒక బాలికకూడ ఇటులనే తన పూర్వజన్మ యందలి అనేక రహస్యములను చెప్పినది. ఆంధ్ర దేశమునుండి సహితము అనేకమంది ప్రముఖులు ఆ బాలికను చూచియున్నారు. నేడు, పాశ్చాత్య విద్వాంసులనేకులు పునర్జన్మను గురించి తీవ్రమగు పరిశోధనల నొనర్చుచున్నారు. క్రైస్తవమత సిద్ధాంతము ననుసరించి పునర్జన్మ లేదని వాదించిన పాశ్చాత్య ప్రముఖులనేకులు నేడు పునర్జన్మ సత్యమేయని ఋజువుచేయుచు అనేక గ్రంథములను వ్రాయుచున్నారు. నేడు పాశ్చాత్యులు పరిశోధనల నొనర్చి కొద్దికొద్దిగా తెలుసుకొనుచున్న ఈ రహస్యములను, భారతీయ మహర్షులెన్నడో గ్రహించి తమ అమూల్య గ్రంథములయందు సిద్ధాంతీకరించి యున్నారు. ఇది హిందువు లెంతయును గర్వింపవలసిన విషయము!!

ఇక, ఈ విషయమునుగూర్చి ఆర్యశాస్త్రము లేమి వ్రాయుచున్నవో పరిశీలించెదముగాక! కఠశ్రుతియం దిట్లున్నది:—

“యేయంప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయమస్తీతిచైకే

అనగా, పరలోక మున్నదా, లేదా యనెడి ప్రశ్న మనుష్యు నకు కలుగుచున్నది. నచికేతుని ఈ ప్రశ్నకు ఇట్లు జవాబు చెప్పుచున్నాడు.

నసాంపరాయః ప్రతిభాతిబాలం ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢమ్
అయం లోకోనాస్తి పరఇతిమానీ పునః పునర్వశ మాపద్యతేమే॥

అనగా, అజ్ఞానులును, ధనాది విషయ నిమగ్నులగు మూఢులకు పరలోకమునరిదు విశ్వాసము లేదు. వారు ఇహ లోకమునే తమ సర్వస్వముగ భావించుచున్నారు. కావున నే వారు జనన మరణ చక్రమునందు మరల పరిభ్రమణ మొనర్చు చున్నారు.

ఈ శ్రుతి సిద్ధాంతము ననుసరించియే స్మృతి పురాణాది శాస్త్రములయందు ప్రేతలోక, నరలోక, పితృ లోకాదులు వర్ణింపబడి యున్నవి. ఇవి సూక్ష్మలోకములై యున్నవి. వీనినిగూర్చి భాగవతము 5 వ స్కంధము నందినట్లు చెప్పుచున్నాడు—

"నరకంనామ భగవన్ కిం దేశ విశేషా అథవా బహి స్త్రిలోక్యా అహోస్వి దంతరాల ఇతి"

"అంతరాల ఏవ త్రిజగత్యాస్తుదిశి దక్షిణ స్యామధస్తా ద్భూమేరు పరిష్టాచ్చ జలాద్యస్యామగ్ని ష్వాత్తాదయః పితృగణా నివసన్తి"

"యత్రహవావ భగవాన్ పితృరాజో వైవస్వతః స్వవిషయం ప్రాపితేషు స్వపురుషైర్జన్తుషు పరేతేషు యథా కర్మావద్యం దోషమేవానుల్లఘితభగిశచ్ఛాసనః సగణోదమం ధారయతి"

"తత్ర హైకే నరకానేక వింశతిం గణయన్తి"

భూర్లోకమునందు. దక్షిణ దిశగా, పృధ్వి క్రిందను, జలముమీదను అగ్నిష్వాత్తాది పితృగణములు నివసించుచున్నవి ఇదియే పితృలోక స్థానమై యున్నది ఇచటనే వైవస్వత యమరాజు రాజ్య మొనర్చుచుండును. ఈ యమలోకమందలి యమదూతలే, మృత్యువునకు పిదప పితృలోకమందలి జీవగణమును ఇక్కడకు తీసికొనివచ్చెదరు. ఇక్కడ విచారణము జరిగినపిమ్మట పాప పుణ్యానుసారము జీవులకు సుఖదుఃఖము లొసంగబడును. ఇచట 21 నరకములున్నవి.

దీనినిబట్టి నరకలోకమును, పితృలోకమును పృధ్వికి దక్షిణ దిశయందు దున్నవనియును, ఈ రెండును భూర్లోకమునందే ఉన్నవనియును తెలియుచున్నది. వేదవ్యాసుడు యోగదర్శన భాష్యమునందిట్లు వ్రాయుచున్నాడు.—

“అవీచేః ప్రభృతి మేరుపృష్ఠం యావత్ ఇత్యేష భూర్లోకః। తత్ర వీచే రు పర్యుపరినివిష్టాః షణ్మహానరకభూమయో మహాకాలాంబరీష రౌరవ మహారౌరవ కాలసూత్రాంధతామిస్రాః, యత్ర స్వకర్మోపార్జిత దుఃఖ వేదనాః ప్రాణినః కష్టమాయుర్దీర్ఘమాక్షిప్య జాయంతే, తతః సప్తపాతాలాని॥”

పైన ఉదహరించిన సప్తలోకములకు క్రింద అవీచి యను నరకలోకమున్నది. ఆ అవీచినుండి సుమేరు పృష్ఠ పర్యంత ప్రదేశమును భూర్లోక మనుచున్నారు. అవీచికి పైనను పృధ్వికి క్రిందను 6 నరకలోకము లున్నవి. అవి మహాకాల అంబరీష, రౌరవ, మహారౌరవ, కాలసూత్ర, అంధతామిస్రములని పిలువబడును. వీనిలో జీవులు తమతమ పాపకర్మ

జన్యమగు తీవ్ర దుఃఖముల ననుభవించుచుందురు. అవిటికి క్రింద అతల వితలాది సప్త అధోలోకము లున్నవి. దేవీ భాగవతమునందు ప్రేతలోక, నరకలోక, పితృ లోకాదులను గురించి అనేక ప్రమాణములు ఉన్నవి—

పిశాచ ప్రేత భూతానాం విహారాజిర ముత్తమం
అన్తరిక్షం చ తత్ప్రోక్తం యావద్ వాయుః ప్రవాతిహి॥

భూత ప్రేత గణములు భూర్లోకమందలి శూన్య స్థానములయందు నివసించును. వీని శరీరములు వాయుసంబంధమైనవగుటచే, వాయు వెంతవరకు యుండునో అంతవరకును అవి నివసించగల్గును. అదే పురాణమునందు పితృలోకమును గూర్చి ఇట్లు చెప్పుచున్నాడు—

త్రిజగత్యా అంతరాళే దక్షిణస్యాం దిశిహ్యధః
భూమే రథస్తాదు పరిత్వతలస్యచ నారద॥
అగ్నిష్వాత్తాః పితృగణావగ్నే పితరశ్చహ
పితృరాజోపి భగవాన్ సంపరేతేషు జంతుషు॥
విషయం ప్రాపితేష్వేషు స్వకీయైః పురుషైరిహ
సగణో భగవత్ ప్రోక్తా జ్ఞానపరోదమధారకః॥
నరకానేక వింశత్యా సంఖ్యయా కథ్యన్తిహి
అష్టావింశ మితాన్ కే చిత్తా రనుక్రమతో బ్రువే॥

అనగా, భూర్లోకమునందే, దక్షిణ దిశలో, పృధ్వికిక్రింద, అతల లోకమునకు పైగా, అగ్నిష్వాత్తాది పితృగణములును, నైమిత్తిక పితృగణములును నివసింపుచున్నారు. పితృలోకమునకు రాజగు యముడుకూడ అచటనే నివసింపుచున్నాడు. అతడే, పరమే

శ్వరుని ఆజ్ఞ ననుసరించి పాపులను శిక్షింపుచుండును. మొత్తము 21 నరకము లున్నవి. కొందరు 28 నరకము లున్నవని నిర్ణయించి యున్నారు.

యమలోక, పితృలోకములను గురించి వేదమునందు సహితము ప్రమాణములున్నవి. అధర్వవేదము 6-12-119 యందిట్లు చెప్పబడి యున్నది.

ఋణాన్నో నర్ణమేర్త్సమానో యమస్యలోకే అధిరజ్జురాయత్
ఏ ఋణమువలన మన చేతులను త్రాళ్ళతో బంధించి యమలోకమునకు తీసుకొని పోయెదరో అట్టి ఋణము మనకు ఉండకుండునుగాక!

బృహదారణ్యకోపనిషత్తునం దిట్లు వ్రాయుచున్నాడు-
యేశతం మనుష్యాణా మానన్దాః స ఏకః పితౄణాంజిత లోకానామానందః

అనగా, మర్త్యలోకమందలి ఆనందముకంటెను నూరురెట్లు అధికమగు ఆనందము పితృలోకమునందు లభించును.

గీతాశాస్త్రమునందిట్లు చెప్పబడి యున్నది.

భూతానియాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపిమామ్

అనగా, ప్రేతములను ఉపాసించువారు ప్రేతలోకమునకు పోవుచున్నారు. భగవానుని ఉపాసించువారు భగవంతుని పొందుచున్నారు.

ఇటులనే, నరకలోకమును గురించియును "పతంతి నరకేఽశుభౌ" అనగా అశుచియగు నరకలోకమునందు పడునని భగవద్గీతయందు వ్రాయబడి యున్నది.

మనుసంహిత 12 వ అధ్యాయమునందు కర్మభ్రష్టు లగు నాల్గు వర్ణములవారికిని నాలుగు విధములగు ప్రేతత్వము సంభవించుననని వ్రాయుచున్నాడు—

వాన్తాశ్యుల్కాముఖః ప్రేతో విప్రో ధర్మాత్ స్వకాత్ చ్యుతః
అమేధ్యకుణపాశీ చ క్షత్రియః కటపూతనః
మైత్రాక్షజ్యోతికః ప్రేతో వైశ్యో భవతి పూయభుక్
చైలాశకశ్చ భవతి శూద్రో ధర్మాత్ స్వకాచ్చ్యుతః॥

అనగా స్వధర్మ భ్రష్టుడగు బ్రాహ్మణుడు వమన భక్షణ మొనర్చెడి ఉల్కాముఖ ప్రేతమగును. కర్మ భ్రష్టుడగు క్షత్రియుడు శవ, విష్టాభక్షణ మొనర్చెడి కటపూతనమను ప్రేతమగును. కర్మభ్రష్టుడగు వైశ్యుడు పూయభక్షణ మొన ర్చెడి మైత్రాక్ష జ్యోతికమను ప్రేతమగును. కర్మభ్రష్టుడగు శూద్రుడు కీట భక్షణ మొనర్చెడి చైలాశకమను ప్రేతమగును

గీతా శాస్త్రమునందిట్లు చెప్పబడియున్నది,—

ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజంతే తామసా జనాః॥

అనగా తామసికులు భూత ప్రేతములను ఉపాసించు చున్నారు.

అథర్వణ వేదము 8-3-6 సం దిట్లున్నది.—

యే సూర్యాన్న తితిక్షన్త ఆతపన్త మముం దివః
అరాయాన్ వాస్తవాసినో దుర్గంధిం ల్లోహితాస్యాన్ మశకాన్ నాశయామసి॥

అనగా ప్రేత గణములు సూర్యుని తేజస్సును సహింపజాలక పగలంతయును దాగియుండును. శ్రీ హీను

లును, మేషచర్మ పరిధానకారులును, రక్తముఖులును, దుర్గంధ శరీరులు నగు వీరిని మంత్రశక్తి వలనను ద్రవ్యశక్తి వలనను నాశన మొనర్పవచ్చును.

> దశవృక్ష ముంచేమం రక్ష గ్రాహ్యా అధియైనం జగ్రాహ పర్వసు
> అథో ఏనం వనస్పతే జీవానాం లోకముత్తమమ్ (అథర్వ 2-2-9)

హే పలాశ ఉదుంబరాది దశవృక్ష శకలనిర్మిత మణీ! నీవు అమావాస్యనాడు ఈ మనుష్యుని ఆవేశించిన బ్రహ్మరాక్షస ప్రేతమును తొలగించి ఆ మనుష్యునకు జీవనదాన మొసంగుము.

ఇట్టి వేదప్రమాణము లనేకములున్నవి. ఇక పాశ్చాత్యుల పరిశోధనా ఫలితములను, వారి అభిప్రాయములను ఇంతకు క్రితమే వివరించి యున్నాము. కావున ఈ విషయమును నిర్లక్ష్యముగ త్రోసివేయక జాగ్రత్తగా పరిశీలించుటయే బుద్ధిమంతుని లక్షణమై యున్నది.

ప్రేతలోకమును గురించియు, అచట నివసించువారిని గురించియును తెలుసుకొన వలయునని ఇప్పుడిప్పుడే పాశ్చాత్యులు ప్రయత్నించుచున్నారు. వారి పరిశోధనలు చాల జయప్రదముగ జరుగుచునే యున్నవి. కాని ఈ విషయములను భారతీయులెన్నడో అత్యంత ప్రాచీన కాలమునందే గ్రహించి యుండిరి. మృతశరీర మందలి ప్రేతమును పిల్చి; దానివలన అనేక సిద్ధులను పొందెడి శవసాధన పద్ధతులు అనేకములు మన తంత్ర గ్రంథములయందు వర్ణింపబడి

యున్నవి. ఈ విషయములను అనేకులు తమ స్వానుభవము నందు సహితము ఆచరించి ఫలితమును పొందియున్నారు! వారి అనుభవముల వలన తెలిసికొనిన కొన్ని విషయము లను ఇచట ఉదహరింపుచున్నాము:-

"ప్రేతముయొక్క శరీరములు వాయుసంబంధ మైన దిగ నుండును. కావున ఇంటియొక్క తలుపులనన్నింటిని బం ధించినను, ఏదో ఒక రంధ్రముగుండ గాలిద్వారా లోపలికి ప్రవేశించును. ప్రేతమునకు వాస్తవముగా పాంచభౌతిక శరీ రము లేకపోయినను వాసనావేశమువలన స్థూల శరీరమును ధరించి మన కన్నులకు కాన్పించవచ్చును. ప్రేతమునకు ప్రేమ గలవారి దగ్గరకు అనగా భార్యాబిడ్డల దగ్గరకు తన నిజరూ పముతో వచ్చి ప్రత్యక్షమగును. ప్రేతములు తమతమ వాస నల ననుసరించి అనేక రూపములను ధరించును. వాయుతత్త్వ మును ఆకర్షించి తుపాను రూపముననను, అగ్నితత్త్వమును ఆక ర్షించి అగ్నిమయరూపమునను స్మశానములయందు కాన్పించి ప్రజలను భయపెట్టును. కాని అన్ని ప్రేతముల యందును అట్టిశక్తి ఉండదు. ఎవరు ఏ భావావేశమునందు ప్రేతములగు దురో, వారు ప్రేతశరీరమునందు అదే ఆచరణగలిగి యుందురు. అనేక భావములతో ప్రేతములగుదురు. కామ, క్రోధ, ధన లోభాదుల ఆవేశమునందు మరణసమయమున మూర్ఛకలిగిన యెడల, వాడు అట్టి ప్రేతముగ నగును. ఆత్మ హత్య యొనర్చుకొనిన వారుకూడ ప్రేతములగుదురు. పిడుగు

వలననో, ఇల్లు కూలుటచేతనో ఆకస్మికముగ మరణించిన వారుకూడ ప్రేతములగుదురు. వీని ఆచరణ లక్ష్యమును వేరు వేరుగ నుండును. కాముక ప్రేతము కామచేష్టల యొనర్చు చుండును. అనగా పురుష ప్రేతము స్త్రీలను, స్త్రీ ప్రేతము పురుషులను ఆవేశించుచుండును. పుత్రాదులమీఁది ప్రేమతో మరణించిన ప్రేతము ఎల్లపుడును వారి యొద్దకు రావలయు నని ప్రయత్నించుచుండును ఒక్కొకసారి వారినిచంపి, తన స్థితికే మార్చుకొనవలయునని కూడ ప్రయత్నించును. ధనలోభియగు ప్రేతము తన జీవిత కాలమునందు సంపాదించిన ధనముచుట్టును తిరుగుచుండును. అది వ్యయమగుటను చూచి దుఃఖించుచుండును. ఆత్మహత్యవలన ప్రేతరూపము నందిన ప్రేతము, ఎప్పుడును చీకటియందుండ గోరుచుండును. ఆత్మహత్య యొనర్చుకొనగోరు మనుష్యులను ఉద్రేకింపజేయు చుండును. పిడుగు మొదలగు వానివలన ఆకస్మికముగ మరణించి ప్రేతరూపము ధరించిన ప్రేతములు నిస్తబ్ధముగ కూర్చుండి యుండును. నల్లమందు మత్తుగల వారివలె ఊరక ఊగుచుండగోరును. యుద్ధమునందు పిరికితనము వలన మరణించినవారి ప్రేతములు కబంధములుగ నుండును. చేతియందు ఆయుధమును ధరించి యుండును. ఇవి చాల దుర్మార్గమున ప్రవర్తించును ప్రజలను బాధించుట, భయపెట్టుటయే వీటిపని. ఇతరులమీఁది ద్వేషముతో మరణించినవారి ప్రేతములు తమ శత్రువులను బాధించి చంపును. ఇట్టి ప్రేతము లనేకములు కాన్పించు చున్నవి.

ఈ విషయములను గూర్చి పాశ్చాత్యులు తీవ్రముగు పరిశోధనలు జరిపి యున్నారు. రిచర్డ్ బుష్ గారు Modern Spiritualism నందిట్లు వ్రాయుచున్నాడు:-

Evil spirits are of all degrees. All who pass over with a sense of injustice in their heart, and hatred anger and revenge no matter for whatsoever cause, serious or trivial, illegitimate or apparently justifiable are a danger in any world, causing unrest and ill-will amongst men. Their thoughts and feelings are, like wireless messages, broadcasted in the ether and atmosphere of space and are picked up as suggestions and impulses by those whose minds and characters respond to such vibrations. More than that, they can in person, by their presence, inspire control or obsess suitable mortals to hate, anger and revenge to wound or murder. They hope to gain satisfaction by these means.

Then siimlarly there are those who have allowed jealousy to eat like a cancer into their soul. There are the greedy and avaricious, those who love and crave for power and authority over their fellows, who love flattery, honour and glory above all else. There are the sensualists (and alas they are many) who always been making provision for the flesh to fulfil the lusts thereof— sexual excess, drink, eating, drugs, love of money and so on. People dying with strong fleshly lusts upon them carry the memory and desire for these with them. But they have no means of gratification— or full

grati- fication and so seek to come back and enjoy their lust in a second hand sort of way by obsessing mortals to the same lust and picking up i. e., absorbing emotions thus engendered.

MODERN SPIRITUALISM.
Richard A. Bush—Kalpaka, 6-23

క్రోధము, ద్వేషము మొదలగు భావములతో మరణించి ప్రేతము లైనవారు తమ పాపబుద్ధిని అప్పుడుకూడ వదల జాలరు. వారు ఇతరులలో ప్రవేశించి ఆ భావములను ఉద్రేకింప జేసెదరు. దీనివలన వారికి ఆనందము కలుగును. కాముక ప్రేతములు తమ కామవాంఛను తీర్చుకొన ప్రయత్నించును. ఆ ప్రేతములు ఇతరుల శరీరమునందు ప్రవేశించి కామోద్రేకమును కలిగించును. దీనివలన వారికి ఆనందము కలుగును. ప్రేతము లిట్టి పాపకార్యము లాచరింపుచుండును.

ప్రేతములు అందరకును కాన్పించవు. చీకటియందు చూడగల జంతువులకు అనగా పిల్లి, సింహము, కుక్క మొదలగు వానికి ఈ ప్రేతములు బాగుగా కాన్పించును. రాత్రులయందు కుక్కలు విపరీతముగ మొరుగుటకిదియే కారణము. ప్రేతములను చూచి, మనుష్యులనుకొని కుక్కలు అఱచుచుండును. ఇటులనే కొందరు స్త్రీ, పురుషులకు ఈ ప్రేతములను చూడగల ఒక ప్రత్యేక విధమగు దృష్టి [Psychic Sight] యుండును. వారు ప్రేతములను చూడగలరు. వారిలో మరి కొందరు ప్రేతములతో మాట్లాడగలరు. మనుష్యునివలె ప్రేతములు మాట్లాడజాలవు. ప్రేతము మనతో మాట్లాడదలంచి

నపుడు శ్రోతయొక్క మనస్సునందట్టి ప్రేరణను కలుగ జేయును. ఆప్రేరణవలన శ్రోతయొక్క చెవులయందు టెలిఫోను చేసినట్లుగా శబ్దము కలుగును. అన్ని ప్రేతముల ప్రకృతియును ఒకేవిధముగ నుండదు. కాని, బ్రతికియున్నపు డెట్లుండునో సామాన్యముగా ప్రేతముకూడ అటులనే యుండును. సూర్యుని వెలుగునందు ప్రేతముయొక్కశక్తి తగ్గిపోవును. అవి వెలుగును సహింపజాలవు. సామాన్యముగా చీకటియందే నివసింపుచుండును. దీనికి వేదప్రమాణముకూడ ఇంతకు క్రితమే చూపించియున్నాము. నిశాచర జంతువులవలెనే ప్రేతములుకూడ పొద్దుగ్రుంకినవెంటనే సంచారమునకు బయలుదేరును. ఆహారముకొరకు వెదకుచుండును. కావుననే సంధ్యాకాలమునందు భోజనమొనర్పకూడదని శాస్త్రముల యందాజ్ఞాపింపబడియున్నది. స్థూలరూపముగ ప్రేతములు భుజింపజాలకపోయినను ఆహారము తినుచుండగా చూచినైనను అవి తృప్తిజెందును. ప్రేతములకు అసలు భోజనముకన్నను ఉచ్ఛిష్టభోజనమునందే ప్రీతియెక్కువ. ప్రేతముయొక్క దృష్టి తగిలిన ఫలము వృక్షమునుండి క్రిందపడిపోవును. లేక ఎండిపోవును.

ప్రేతములు ఏకాంతస్థానములం దుండగోరును. కావుననే పాడుబడిన యిండ్లయందును, స్మశానములయందును, అంధకారమయములగు గృహములయందును, వృక్షాదులయందును ప్రేతములు నివసించుచుండును. యజ్ఞము, వేదఘోష,

శాస్త్రచర్చ. ఘంట శంఖనాదములు జరుగుచోట్ల ప్రేత ముండదు. ప్రేతను నీటిని చూచినయెడల చాలభయపడును. ప్రేతములను, మనము కోరుచుకొనినయెడల రూపాయలను, ఫలములను తీసికొనివచ్చి మనకు యిచ్చును. సామాన్యముగా స్త్రీలనే ప్రేతములు ఆవేశింపుచుండును. మూర్ఖుడగు వ్యక్తిని విద్వాంసుడగు ప్రేతము ఆవేశించినపుడు వాడు ధారాళ ముగ సంస్కృతమునో, ఇంగ్లీషునో, అరబ్బిభాషనో మాట్లాడుట సహజముగ సంభవించుచుండును. ఈ ప్రేతములను భేతాళురను రాజులు పరిపాలించు చుందురు. తుపాను మొద లగు ఉపద్రవములు సంభవించినపుడు, అనగా పంచభూత ములయందు వికారము [Elemenal disturbance] సంభ వించినపుడు ప్రేతములు చాల బాధపడును. ఒక ప్రేతము-

When there is commotion in elements there is great commotion within us. "Spirits"

అని చెప్పినది. ప్రేతమునకు తన పూర్వశరీరమునందు చాల ప్రీతియుండును. మరణించిన పిదప ఆ శరీరముతోపాటు స్మశానమువరకును వెంబడించి పోవును. ఆ శరీరమును తగుల బెట్టునపుడు ప్రేతము చాల దుఃఖించును. ఆ శరీరము సంపూర్ణముగ తగులబడునంత వరకును అచటనే యుండును. ఆత్మహత్యకూడ అప్పుడప్పుడు ఆ స్థలమునకు వచ్చి చూచి పోవుచుండును. నీటిలో మరణించిన ప్రేతమునకు నీటిని చూచి నపుడు చాల భయము కలుగును. పిడుగువలన మరణించిన వానికి పిడుగుపడునపుడు చాల భయము కలుగును.

ప్రేతజీవనము చాల కష్టదాయకమును, అశాంతిప్రదము నైయుండును. కాని వాని హృదయమునందెప్పుడును ఏదో వేదన బాధింపుచుండును. కావుననే ప్రేతములు నిముషమైనను నిలిచినచోట నిలువక ఎప్పుడును తిరుగుచుండును. కామాంధ ప్రేతము కామ్యవస్తువులను చూచియును, ధనాంధప్రేతము ధనమును చూచియును దుఃఖింపుచుండును.

ఒక స్త్రీ మరణించి ప్రేతమైన దనుకొనుడు. ఆమె భర్త మరల ద్వితీయ వివాహ మొనర్చుకొనెననుకొనుడు. ఆ నూతన వధువును తన భర్తతో కలియుటను చూచి ఈ ప్రేత చాల దుఃఖించును. ఒకనికి చాల ధనమున్నదనుకొనుడు, వాడు మరణించునపుడు ఆ ధనమునుగూర్చి ఆలోచించుచు మరణించె ననుకొనుడు: వానికి ధనలోభము పోలేదు. వాడు ప్రేతమైన పిదప సహితము ఆ ధనమున్న గృహమునందే నివసించును. ఆ ధనము వ్యయమగుటను చూచి విలపించును. ఇదేవిధముగా ప్రేతములు దుఃఖింపుచుండును. ఉన్మత్తులవలె తిరుగుచుండును. స్మశానమునందు పొర్లాడుచుండును. మృత్యుసమయమునందు ఏ కష్టముతో మరణించెనో ఆ కష్టము ప్రేతావస్థయందు సహితము అవిచ్ఛిన్నముగ నుండును. ఒక కులటయగుస్త్రీ కత్తితో పొడువబడి మరణించెను. ఆ ప్రేతమును చూచినపుడు ఆమె శరీరముపై ఆ గాయములు సహిత ముండెను. ఒకడు మరణించు సమయమున నీరు దొరకక దప్పికతో మరణించెననుకొనుడు. వాడు ప్రేతమైన పిదప సహితము దప్పికతో "నీరు

నీరు" అని కేకలు వైచుచు తిరుగుచుండును. ఎవరైనను వానికి కొంచెమునీటి నిచ్చినయెడల తృప్తి జెందును. కావున నే ప్రేత యోనియందలి జీవులకు శ్రాద్ధాదిక్రియ లొనర్పవలసినదిగా ఆర్యశాస్త్రములయం దాజ్ఞాపింప బడియున్నది. శ్రాద్ధమును సక్రమముగ అనుష్ఠించుట వలన ప్రేతయోనినుండి జీవుడు ముక్తుడగును.

ఇక నరకలోకమునుగూర్చి శాస్త్రము లేమిచెప్పుచు న్నవో ఆలోచించెదము గాక! ఉపనిషత్తునందిట్లు వ్రాయబడి యున్నది:-

అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః
తాంస్తే ప్రేత్యాభి గచ్ఛంతి యేకే చాత్మ హనోజనాః

అనగా ఆత్మఘాతకులగు పాపులు మరణానంతరము ఘోర అంధకారావృతమును, అంధకారమయమునగు నరకాది లోకములను ప్రవేశించెదరు. మనుసంహితయం దిట్లున్నది.

యథాయథా నిషేవంతే విషయాన్ విషయాత్మకాః
తథాతథా కుశలతా తేషాం తేషూపజాయతే
తేభ్యాసాత్ కర్మణాం తేషాం పాపానా మల్పబుద్ధయః
సంప్రాప్నువంతి దుఃఖాని తాసుతాస్విహ యోనిషు
తామిస్రాదిషు చోగ్రేషు నరకేషు వివర్తనమ్
అసిపత్ర వనాదీని బంధనచ్ఛేదనానిచ
వివిధాశ్చైవ సంపీడాః కాకోలూకైశ్చ భక్షణమ్
కరంభ వాలుకా తాపాన్ కుంభీపాకాంశ్చ దారుణాన్
బహూన్ వర్షగణాన్ ఘోరాన్ నరకాన్ ప్రాప్యతత్క్షణాత్
సంసారాన్ ప్రతిపద్యంతే మహాపాతకి నస్త్విమాన్

అనగా, విషయసేవవలన భోగస్పృహ మరింత బల వత్తరమై, జీవునకు పరలోకమునందు అనేక విధములగు మహా బాధల నొసంగును పాపకర్మ వలన తామిస్ర, అసిపత్రవన, బంధన ఛేదనాది నరకములు ప్రాప్తించును. అచట కాక, ఉలూకాదులు భక్షించును. వేడి ఇసుకమీద నడువవలసి వచ్చును కుంభీపాకాది నరకములయందు భయంకరమగు బాధ ననుభవింపవలసి వచ్చును నరకమునందుండు శరీరము నకు యాతనా దేహమని పేరు. ఇది ప్రేతశరీరమువలె వాయ వీయ శరీరము కాదు. మరణానంతరము, యమదూతలు జీవుని యాతనా శరీరమునం దిమిడ్చి నరక లోకమునకెట్లు తీసికొని పోవుదురో భాగవతము 5 స్కంధమునందు వ్రాయ బడి యున్నది.

"తత్ర హైకే నరకానేకవింశతిం గణయంతి తామిస్రో న్ధతామిస్రో రౌరవో మహారౌరవః కుంభీపాకః కాలసూత్ర మసిపత్రవనం సూకరముఖ మంధకూపః కృమిభోజనః సందం శస్తప్త శూర్మి ర్వజ్ర కంటక శాల్మలీ వైతరణీ పూయోదః ప్రాణరోధో విశసనం లాలాభక్షః సారమేయాదన మవీచి రయః పానమితి। కించ క్షారకర్దమో రక్షోగణభోజనః శూల ప్రోతో దందశూకోఽవటనిరోధనః పర్యావర్తనః సూచీ ముఖ మిత్యష్టావింశతి నరకా వివిధ యాతనా భూమయః।"

తామిస్ర, అంధతామిస్ర, రౌరవ, మహారౌరవ, కుంభీపాక, కాలసూత్ర, అసిపత్రవన, సూకరముఖ, అంధ

కూప, కృమిభోజనాది 21 నరకములున్నవి. కొందరు క్షార కర్దమ. రక్షోగణభోజన, శూలప్రోతాది 7 నరకములను కలిపి మొత్తము 28 నరకము లనుచున్నారు. ఏ నరకమునందు ఏ పాపకర్మవలన ఏ బాధల ననుభవింపవలసినదియును ఇట్లు వర్ణింపబడి యున్నది.

"యస్తు పరవిత్తాపత్య కలత్రాణ్యపహరతి సహి కాల పాశబద్ధో యమపురుషై రతిభయానకై స్తామిస్రే నరకే బలాన్నిపాత్యతే"

"ఏవ మేవాంధతామిస్రే యస్తు వంచయిత్వా పురుషం దారాదీనుపభుంక్తే"

యస్త్విహవా ఏతదహమితి మమేదమితి భూతద్రోహేణ కేవలం స్వకుటుంబమేవానుదినం ప్రపుష్ణాతి సతదిహ విహాయ స్వయమేవ తదశుభేన రౌరవే నిపతతి"

అనగా ఇతరుల ధనమును, సంతానమును, స్త్రీలను అపహరించినవారని యమదూతలు తీసికొనిపోయి తామిస్రి నరకమునందు పడవేయుదురు. భర్తను మోసగించి అతని భార్యతో సంభోగించెడి వానిని అంధతామిస్రమను నరకము నందు పడవేయుదురు. ఎవడు అనేక ప్రాణులను హింసించి కుటుంబపోషణ మొనర్చుకొనునో, వాడు రౌరవ నరకమునకు పోవును. ఈ విధముగా సూక్ష్మశరీరములతో సూక్ష్మలోకము లగు నరకాదులయందు పాపులు బాధల ననుభవింపుచుండురు. నరకలోకమునందు ఆ యా బాధల ననుభవించిన పిదప,

మరల భూలోకమునందు తమతమ కర్మల ననుసరించి జన్మించెదరు. లేక స్వర్గమునుండి నరకమునకు గాని, నరకమునుండి స్వర్గమునకుగాని వారి పాపపుణ్య కర్మల ననుసరించి పోవుదురు.

ఇక పితృలోకమునందు అగ్నిష్వాత్త ఆర్యమాది నిత్య పితృగణములును, భూలోకమునుండి మరణానంతరము పితృరూపము ధరించిన నైమిత్తిక పితరులు నుందురు. అధర్వవేదము నందు నిత్యనైమిత్తిక పితరులను గురించి అనేక ప్రమాణములున్నవి.

అధర్వవేదముయొక్క అష్టాదశ కాండమునందు:-

సరస్వతీం పితరోహవన్తే దక్షిణాయజ్ఞ మభినక్షమాణాః

దక్షిణభాగమునందాసీనులైయున్న పితృగణము సరస్వతిని ఆహ్వానించుచున్నారు.

సరస్వతీ యా సరథం యథాథోక్థై స్వధాభిర్దేవి పితృభిర్మదంతి. (18-1-1 + 18-2-2)

ఆహ్వానముచే సంతుష్టిజెందిన సరస్వతీదేవి స్వధాభోక్తలగు పితరులతో ఆనందముగ నున్నది.

ఉదీరతామవర ఉత పరాస ఉన్మధ్యమాః పితరః సోమ్యాసః
అసుమ్ యఈ యురవృకా ఋతజ్ఞాస్తేనో వన్తు పితరోహవేషు

నికృష్ట, ఉత్కృష్ట, మధ్యమ శ్రేణులయందలి పితృగణము సోమరసమును సంపాదించి యజమాని ప్రాణమును రక్షించుచున్నారు. వారు అహింసకులును, సత్యవిదులునై

యున్నారు. వారు మనచే ఆహ్వానింపబడి మనలను రక్షించె దరు గాక.

ఇదం పితృభ్యో నమో అస్త్వద్య యే పూర్వాసో య ఉపరాస ఈయుః
యే పార్థివే రజస్యా నిషత్తా యే వా నూనం సువృజనాసు విక్షు॥

ఇంతకు క్రితమే పితృలోకమునకు పోయిన పితరుల కును, ఇంకను భూలోకమందున్న పితరులకును. పదిదిశలయందు వ్యాపించియున్న పితరుల కందరకును నమస్కరింపుచున్నాను.

మా త్వా వృక్షస్సంబాధిష్ట మా దేవీ పృథివీ మహీ.
లోకం పితృషు విత్త్వైధస్వ యమరాజసు

ఓ ప్రేతమా! నిన్ను వృక్షములు బాధింపకుండును గాక! పృథ్వి బాధింపకుండునుగాక! నీవు యమరాజుయొక్క లోకము నకు పోయి అచట పితృలోకమునందు సుఖముగా నివసింపుము.

"ఆయన్తు నః పితరః స్వ్యాసః స్యోనం కృణ్వన్తః ప్రతిరన్తం ఆయుః"

ఈ యజ్ఞమున మా పూర్వజులగు పితృగణము వచ్చును గాక! వారు తృప్తి జెంది, మాకు సుఖమును, ఆయుస్సును ఇచ్చె దరుగాక!

యే నిఖాతా యే పరోప్తా యే దగ్ధా యే చోద్ధితాః
సర్వాంస్తానగ్న ఆవహ పితౄన్ హవిషే అత్తవే॥

ఓ అగ్ని! భూమియందు పూడ్చబడినట్టియు, దూరదేశ ములయందు పారవేయబడినట్టియు, తగులబెట్టబడినట్టియు మా పితరులందరును పితృలోకమునందున్నవారగుటచే వారి నందరను మాచే ఒసంగబడిన హవిర్భోజన మొనర్చుటకు ఇచ టికి తీసికొని రమ్ము.

యే అగ్నిదగ్ధా యేచ అనగ్నిదగ్ధా మధ్యేదివః స్వధయా మాదయన్తే
త్వంతాన్ వేత్థ యదితే జాతవేద స్వధయాయజ్ఞం స్వధితింజుషన్తామ్||

ఓ అగ్నీ! అగ్నియందు తగులబెట్టబడియును, భూమియందు పూడ్చబడియును, ఇప్పుడు స్వధాపుష్టులై ద్యులోకమునందు ఆనందించుచున్న **మా పితరులను** నీవు ఎరిగియుండిన యెడల, వారు మాచే ఒసంగబడిన స్వధవలన తృప్తులగునట్లు, వారితో చెప్పుము. నిత్యనైమిత్తిక పితరులనుగురించి చెప్పబడిన ఇట్టిప్రమాణములనేకములు వేదమునందున్నవి. మనుసంహిత తృతీయాధ్యాయమునం దిట్లు వ్రాయబడియున్నది.

అక్రోధనాః శౌచపరాః సతతం బ్రహ్మచారిణః
న్యస్తశస్త్రా మహాభాగాః పితరః పూర్వదేవతాః||
మనోర్హైరణ్యగర్భస్య యే మరీచ్యాదయః సుతాః
తేషామృషీణాం సర్వేషాం పుత్రాః పితృగణాః స్మృతాః||
విరాట్ సుతాః సోమసదః సాధ్యానాం పితరః స్మృతాః
అగ్నిష్వాత్తాశ్చ దేవానాం మరీచా లోకవిశ్రుతాః||
దైత్య దానవ యక్షాణాం గంధర్వోరగ రక్షసామ్
సుపర్ణకిన్నరాణాంశ్చ స్మృతాబర్హిషదోఽత్రిజాః||

సోమపానామవిప్రాణాం క్షత్రియాణాం హవిర్భుజః
వైశ్యానామాజ్యపానామ శూద్రాణాంతు సుకాలినః||
సోమపాస్తు కవేః పుత్రా హవిష్మంతోఽఙ్గిరసః సుతాః
పులస్త్యస్యాజ్యపాః పుత్రావసిష్ఠస్య సుకాలినః||
అగ్నిదగ్ధానగ్నిదగ్ధాన్ కావ్యాన్ బర్హిషదస్తథా
అగ్నిష్వాత్తాంశ్చ సౌమ్యాంశ్చ విప్రాణామేవ నిర్దిశేత్||
యఏతేతు గణాముఖ్యాః పితౄణాం పరికీర్తితాః
తేషామపీహ విజ్ఞేయం పుత్రపౌత్రమనంతకమ్||

పితృగణము క్రోధశూన్యులును, శౌచపరాయణులును, సదాబ్రహ్మచారులును, శస్త్రత్యాగులును, మహాత్ములును, దేవతలకంటె పూర్వులు నై యున్నారు. బ్రహ్మపుత్రుడగు మనువు యొక్క పుత్రులగు మరీచాదుల కుమారులందరును సోమపాది పితృగణమని పిలువబడుదురు. వారిలో సోమసద నామక విరాట్టుని పుత్రులు సాధ్యులయొక్క పితరులై యున్నారు. అగ్నిష్వాత్తాది మరీచి పుత్రగణము దేవతలయొక్క పితరులై యున్నారు. బ్రాహ్మణులయొక్క పితరులు సోమప గణమును, క్షత్రియులయొక్క పితరులు హవిర్భుజ గణమును, వైశ్యుల యొక్క పితరులు ఆజ్యప గణమును, శూద్రులయొక్క పితరులు సుకాలిన గణమునై యున్నారు. బర్హిషదాది అత్రిపుత్ర గణము దైత్య, దానవ, యక్ష, గంధర్వ, సర్ప, రాక్షస, సుపర్ణ, కిన్నరాదుల కందరకును పితరులై యున్నారు. భృగు పుత్రగణము సోమపులును, అంగిరః పుత్రగణము హవిర్భుజులును, పులస్త్య పుత్రగణము ఆజ్యపులును, వసిష్ఠ పుత్రగణము సుకాలినులునై యున్నారు. అగ్నిదగ్ధ, అనగ్నిదగ్ధ, కావ్య, బర్హిషద, అగ్నిష్వాత్త, సౌమ్యాదులు బ్రాహ్మణులయొక్క పితరులై యున్నారు.

కావున ఇంజనీరులను, డాక్టర్లను, అగ్నిష్వాత్తాది పితరులని వ్యాఖ్యానము చేయుట శాస్త్రవిరుద్ధమై యున్నది.

పితృలోకము ఆనందమయమని శ్రుతులయందు చెప్పబడియున్నది. బృహదారణ్యకమునం దిట్లు చెప్పబడియున్నది:-

"స యో మనుష్యాణాం రాద్ధః సమృద్ధో భవత్యన్యేషా మధిపతిః సర్వైః మానుష్యకైర్భోగైః సంపన్న తమః స మనుష్యాణాం పరమ ఆనందోఽథ యే శతం మనుష్యాణా మానందాః స ఏకః పితౄణాం జితలోకానా మానందః"

ఈ ప్రపంచమునందు మహారాజుగా సకల లౌకిక సుఖముల ననుభవించుటలోని ఆనందముకన్న, నూరు రెట్లధికమగు ఆనందము పితృలోకమునందు లభించును. మర్త్యలోకమందలి ఒకనెల పితృలోకమందలి ఒక అహోరాత్రమగును. ఈ అహోరాత్రి క్రమము ననుసరించి పితరులనేక సంవత్సరములు జీవింతురు. కడకు తమకర్తవ్యమును, సాధనను పూర్తి యొనర్చుకొని దైవరాజ్యమునందు సహితమట్టి అభ్యుదయము నే పొందుదురు.

నైమిత్తిక పితృగణము భోగకాల పర్యంతమును పితృలోకమునందుండి తదనంతరము మరల ఈ లోకమునందు జన్మించును.

ఇక పరలోక విజ్ఞాన సారాంశమేమన ప్రతి బ్రహ్మాండమును 7 ఊర్ధ్వలోకములుగను, 7 అధోలోకములుగను విభాగింపబడి యున్నది. ఈ 14 విభాగములలోని మధ్యభాగము నకు భూర్లోకమని పేరు. భూర్లోకము మరల 4 విధములుగ భాగింపబడినది. అవి మృత్యులోక. ప్రేతలోక. నరకలోక, పితృలోకములని పిలువబడును. ఏదైన ఉగ్రమగు పుణ్యమొనర్చినవాడు మాత్రమే దేవభోగము లనుభవించుటకు భువఃస్వః

ఆపై 6 లోకములకును, అసురీ భోగముల ననుభవించుటకు అతలవితలాది క్రింది 6 లోకములకును పోవును. అన్నింటికిని భూర్లోకమే కేంద్రమై యున్నది. కాని, ఇదియొక అసాధారణ నియమము. అఖండమగు తపస్సువలన గొప్ప పుణ్యమును సంపాదించిననేగాని భూర్లోకమునుండి ఎవరలకు పోజాలదు. కావుననే భూర్లోకముతో సంబంధముగల 3 సూక్ష్మలోకము లనే పరలోకములని మన శాస్త్రములయందు వ్యవహరింపబడి యున్నది. ప్రేతలోకమునకు భేతాళాది గణములును, నరక లోకమునకు యమదూతలును, పితృలోకమునకు దేవదూత లును జీవుని తీసికొని పోదురు.

ఇక ప్రసంగవశమున స్వర్గలోకము గూర్చి సంక్షిప్త ముగ వివరించెదను. దీనినే మహేంద్రలోకమందురు. యోగ భాష్యమునం దిట్లు వ్రాయబడి యున్నది:-

"మహేంద్ర నివాసినః షడ్దేవ నికాయాః. త్రిదశ అగ్నిష్వాత్తా యామ్యాః తుషితా అపరినిర్మిత వశవర్తినః పరినిర్మిత వశవర్తినశ్చేతి, సర్వే సంకల్పసిద్ధా అణిమాద్యైశ్వ ర్యోపపన్నాః కల్పాయుషో బృందారకా కామభోగిన ఔప పాదిక దేహా ఉత్తమానుకూలాభి రప్సరోభిః కృతపరివారాః"

మహేంద్రలోకమునందు త్రిదశ, అగ్నిష్వాత్తా, యామ్య, తుషిత, అపరినిర్మిత వశవర్తి, పరినిర్మిత వశవర్తి యను 6 విధములగు దేవతలున్నారు. వారు సంకల్ప సిద్ధు లును, అణిమాది ఐశ్వర్య యుక్తులును, కల్పాంత ఆయుర్యుక్తు

లును, పూజ్యులును, కామ భోగులును అయోని సంభవులునై యున్నారు. వారు సౌందర్యవతులగు అప్సరలతో ఎల్లప్పుడును విహరించుచున్నారు. మహాభారతము, వనపర్వమునం దిట్లున్నది:-

ఉపరిష్టాదస్య లోకస్య యోయం స్వరితి సంజ్ఞితః
ఊర్ధ్వగః సత్పథః శశ్వద్దేవయాన చరోమునే।
నాతప్త తపసః పుంసోనా మహాయజ్ఞ భాజినః
నానృతా నాస్తికాశ్చైవ తత్ర గచ్ఛంతి ముద్గల
ధర్మాత్మనో జితాత్మానః శాన్తా దాన్తా విమత్సరాః
దాన ధర్మరతా మర్త్యాః శూరాశ్చాహ బలక్షణాః
తత్ర గచ్ఛంతి ధర్మాగ్ర్యం కృత్వా శమదమాత్మకమ్
లోకాన్ పుణ్యకృతాన్ బ్రహ్మన్ సద్భిరాచరితాన్ నృభిః
దేవాః సాధ్యాస్తథా విశ్వేతథైన చ మహర్షయః
యామాధామాశ్చ మౌద్గల్య గంధర్వాప్సరస స్తథా॥
ఏషాం దేవనికాయానాం పృథక్ పృథగనేకశః
భాస్వన్తః కామసంపన్నా లోకాస్తేజోమయాః శుభాః॥
త్రయస్త్రింశత్ సహస్రాణి యోజనాని హిరణ్మయః
మేరుః పర్వతరాడ్యత్ర దేవోద్యానాని ముద్గల॥
నందనాదీని పుణ్యాని విహారాః పుణ్యకర్మణామ్
నక్షుత్పిపాసే న గ్లానిర్న శీతోష్ణే భయంతథా॥
బీభత్సమశుభం వాసి తత్రకించి న్నవిద్యతే
మనోజ్ఞాః సర్వతోగంధాః సుఖస్పర్శాశ్చ సర్వశః॥
శబ్దాః శ్రుతిమనోగ్రాహ్యా సర్వతస్తత్ర వైమునే
నశోకోనజరాతత్ర నాయాస పరిదేవనే॥
ఈదృశ స్సమునేలోకః స్వకర్మ ఫలహేతుకః
సుకృతేస్తత్ర పురుషాః సంభవన్త్యాత్మ కర్మభిః॥

తైజసాని శరీరాణి భవంత్యత్రోపపద్యతామ్
కర్మజాన్యేవ మౌద్గల్య న మాతృపితృజాన్యుత॥
న సంస్వేదో న దౌర్గంధ్యం పురీషం మూత్రమేవ చ
తేషాం న చ రజో వస్త్రం బాధతే తత్ర వై మునే॥
న మ్లాయంతి స్రజస్తేషాం దివ్యగంధా మనోరమాః
సంయుజ్యంతే విమానైశ్చ బ్రహ్మన్నేవంవిధాశ్చ తే॥
ఈర్ష్యాశోకక్లమాపేతా మోహామాత్సర్యవర్జితాః
సుఖిస్స్వర్గజితస్తత్ర వర్తయంతే మహామునే॥

అనగా పైభాగమందలి 3వ లోకమునకు స్వర్గలోకమని పేరు. తపోహీన, యజ్ఞహీన, అసత్యపరాయణులగు నాస్తికు లెవ్వరును దీనిలోనికి పోజాలరు. శాంతులును, దాంతులును జితాత్ములును, సమరవీరులునగు పురుషులు మాత్రమే ఈలోకమునకు పోగలరు. దేవ - సాధ్య - విశ్వ - మహర్షి - యామ - ధాము, గంధర్వ అప్సరాది తేజోమయ లోక సమూహ మంతయును స్వర్గలోకాంతర్గతమై యున్నది. అచట 3000 యోజనముల పొడవుగల మేరుపర్వతమును, నందనాది ఉద్యాన సమూహములు నున్నవి. వానియందు దేవతలు విహరింపుచుందురు. ఆకలి, దప్పి, గ్లాని, భయము అశుభము మొదలగు నవేవియును అచట లేవు అచట శీతల మంద సుగంధ పవనమును, హృదయమోహన సంగీతమును ఆనందమును నొసంగుచుండును. అచట శోకము, దుఃఖము, ముసలితనము శ్రమ యనునవి లేశమాత్రమైనను లేవు. పుణ్యబలమువలన అచటికి పోవెడి జీవులకు కర్మజమగు తైజస శరీరము లభించును మాత పితల వలస అచట శరీర ముద్భవించదు. స్వేద, మలమూత్ర, దుర్గం

ధాదులచే జనించు వస్త్రములు అపవిత్రములు కావు. స్వర్గవాసుల గళమునందు ధరించెడి పూలమాలలు ఎన్నటికిని వాడిపోవు. ఈర్ష్యాశోక శ్రమాదులు లేక, మోహమాత్సర్యాదులు లేక - వారు ఆనందముగా ఆలోకమునందు నివసించెదరు.

కఠోపనిషత్తునందిట్లున్నది —

> స్వర్గేలోకే నభయం కించనాస్తి న తత్ర త్వం న జరయా బిభేతి
> ఉభే తీర్త్వా అశనాయాపిపాసే శోకాతిగో మోదతే స్వర్గలోకే॥

స్వర్గలోకమునందు భయము - ముసలితనము - ఆకలి - దప్పి శోకము అనునవి లేక - స్వర్గవాసులు ఆనందించుచుందురు.

> యన్న దుఃఖేన సంభిన్నం నచగ్రస్త మనంతరమ్
> అభిలాషోపనీతంచ తత్సుఖం స్వఃపదాస్పదమ్॥

స్వర్గమునందు సుఖము దుఃఖముతో కలిసి యుండలేదు. సుఖముయొక్క అనంతరముకూడ దుఃఖము ప్రాప్తించదు. కోరినంత మాత్రముననే సకలపదార్థములును లభించును.

అధర్వవేదము 4-34-2నందిట్లున్నది:—

> అనస్థాః పూతాః పవనేన శుద్ధాః శుచయః శుచిమపి యంతి లోకమ్
> నైషాం శిశ్నం ప్రదహాతి జాతవేదాః స్వర్గే లోకే బహు స్త్రైణమేషామ్

ఎముకలు లేనిదియును, పవిత్రమును, నిర్మలవాయుయుతమును - కామాది రహితమునగు స్వర్గమునకు పుణ్యాత్ములు మాత్రమే పోవుచున్నారు. అచట విహరించుటకు అప్సరసలున్నారు. మరియు 4-34-6లో, —

> ఘృతహ్రదా మధుకూలాః సురోదకాః క్షీరేణ పూర్ణా ఉదకేన దధ్నా
> ఏతాస్త్వా ధారా ఉపయంతు సర్వాః స్వర్గే లోకే మధుమత్పిన్వమానాః

(సుశ్రుతము 27అధ్యా) భూతచికిత్స నొనర్చునపుడు, ఆవాలను చల్లుట, నూనె దీపమును వెలిగించుట, అగ్నినిడుంచుట, హవన మొనర్చుట మొదలగు పనులొనర్ప వలయును.

యాః క్లాన్తాస్తమిషీచయో అక్షకామా మనోముహః
తాభ్యో గంధర్వపత్నీభ్యో అప్సరాభ్యో కరంనమః॥

(అధర్వ. 2-2-5) పిలుచునట్టియును, బలము గలిగినట్టియు, జూదమునందు గెలుచునట్టి, మనోహర రూపములుగల గంధర్వపత్నులగు అప్సరసలకు నమస్కరించుచున్నాను.

దర్శయ మాయాతుధానాన్ దర్శయ యాతుధాన్యః
పిశాచాన్ సర్వాన్ దర్శయేతి త్వారభ ఓషధే॥ (4-20-6)

హే ఓషధీ! నీవు నాకు రాక్షసులను, పిశాచములను చూపించెదవని, నేను నిన్ను సేవించుచున్నాను.

త్వయాపూర్వ మథర్వాణో జఘ్నూరక్షాం స్యోషధే
త్వయా జఘాన కశ్యపస్త్వయా కణ్వో అగస్త్యః॥ (4-37-1)

హే ఓషధీ! నీయొక్క ప్రభావమువలననే అథర్వ వేదులగు కశ్యప, కణ్వ, అగస్త్యాదులు రాక్షసులను చంపియున్నారు.

హైమంత్రములవలన, రాక్షసు లున్నారనియు, ఓషధీ! ప్రయోగమువలన వారిని నాశనమొనర్పవచ్చుననియు, గ్రహింపవలసి యున్నది.

యేషాం పశ్చాత్ ప్రపదాని పురః యాష్ణీ పురోముఖా
ఖలజా శకధూమజా ఉరుండా యేచమట్మటాః
కుంభముష్కా అయా శవః తానస్యా బ్రహ్మణస్పతే ప్రతీబోధేన నాశయ॥ (8-6-15)

ఓ అధర్వజ్ఞుడా! ఎవరియొక్క పాదములు వెనుకవైపు

నకు తిరిగియుండునో, ఎవరియొక్క మడమలును, ముఖమును ముందువైపునకు తిరిగియుండునో, ఎవరు పాదములయందు తిరుగుచుందురో. ఎవరు శిరము లేకపోయినను మటమట శబ్దమును చేయుచుందురో, ఎవరియొక్క ముష్కము కుండవలె నుండునో, ఎవరు అతిస్వరితముగ పరుగెత్తగలరో, అట్టి భూతములను ఆవాల ప్రయోగముతో నాశన మొనర్పుము.

పర్యస్తాక్షా అప్రచంకశా అస్త్రైణాః సంతుపండగాః
అవభేషజ పాదయ య ఇమాంసంవివృత్సత్యపతిః స్వపతిం స్త్రియం ॥

చంచల నేత్రములను, వంగిపోయిన నడుమును కలిగి పాదములు లేకుండగనే నడిచెడి భూతములు, ఓ సర్షపా! ఈ స్త్రీనుండి తీసివేయుము.

యే ఆమ్నంజాతా మారయంతి సూతికా అనుశేరతే
స్త్రీభాగాన్ పింగో గంధర్వాన్ వాతో అభ్రమివాజతు (8-6 19)

ఏ భూతములు గర్భమును నాశన మొనర్చుచున్నవో గర్భవతిని బాధించుచున్నవో, స్త్రీ రూపమును ధరించి బాలింతరాలివద్ద పడుకొనుచున్నవో ఆ భూతముల నన్నింటిని తెల్ల ఆవాలు నాశనమొనర్చును గాక!

యే సూర్యాత్ పరిసర్పంతి స్నుషేవ శ్వశురాదధ
బజశ్చ తేషాం పింగశ్చ హృదయేధిని విధ్యతాం॥ (3-6-24)

భర్తనుచూచిన భార్య చాటునకుపోయినట్లే, సూర్యుని చూచి దాగుకొనుచున్న భూతములను శ్వేతసర్షపములు బాధించును గాక.

తం మాషాజ్యం కృత్వా ప్రహిణోమిదూరమ
సగచ్ఛ త్వప్సుషదో ప్యగ్నీన్॥ (12-2-4)

నేను ఆ భూతమును నేతిలో ఉలవలనుకలిపి పోగొట్టు చున్నాను అది జలమునకో, అగ్నికో పారిపోవును గాక!

న్తైనం రక్షాంసి న పిశాచాః సహంతే దేవానామోజః ప్రథమజం హ్యేతత్
యో బిభర్తి దాక్షాయణం హిరణ్యం స జీవేషు కృణుతే దీర్ఘమాయుః॥
(19. 26. 2)

దేవతలయొక్క ఏ మొదటి తేజము దాక్షాయణ హిరణ్యమును ధరింపుచున్నదో, ఆ తేజమును రాక్షస, పిశాచాదు లేవియును బాధింపజాలవు.

శృంగాభ్యాం రక్షో నుదతే మూలేన యాతుధాన్యః
మధ్యేన యక్ష్మం బాధతే నైనం పాప్మాతి తత్రతి (19-26-2)

ఈ మణి తన అగ్రభాగముతో రాక్షసులను, మూల భాగముతో పిశాచములను మధ్యభాగముతో రాజయక్ష్మను నాశనమొనర్చును. పాపులు దీనిని పొందజాలరు. దీనినే నీల మణి యందురు.

ఇట్టి మంత్రములు వేలకొలదిగా అథర్వణ వేదమునందు కాన్పించుచున్నవి. వీనివలన భూతయోని సత్యమనియు, మణి మంత్రాదులతో వానిని పారద్రోలవచ్చు ననియు తెలిసికొనగల్గితిమి. ఈ విషయమును అనేకులు పాశ్చాత్య విద్వాంసులు సహితము అంగీకరించినట్లు ప్రమాణములను చూపించియే యున్నాము. కావున పరలోకమును గూర్చియును, జన్మాంతర తత్త్వమును గూర్చియును పాఠకులు గ్రహించి కర్తవ్యమును నిర్వర్తించుదురనియే విశ్వసించుచున్నాము.

సంపూర్ణము.